# మన సాహిత్యచరిత్ర – సంకలనాల్లో, పత్రికలలో, విమర్శల్లో …

## కల్పనా రెంటాల, నిడదవోలు మాలతి చర్చ

జులైలో నేను కల్పనా రెంటాలని కలిసినప్పుడు, చేసిన ఇంటర్వ్యూ ఇది. ఇది ప్లానేమీ లేకుండా చేసినది. అవి ఒక క్రమపద్ధతిలో జరగలేదు. ప్రధానంగా నాకు కలిగిన ఒక సందేహం – మరో వందేళ్ళు పోయేక, ఈనాటి, అంటే ఇప్పుడు నాకళ్ళముందు నడుస్తున్న సాహత్య చరిత్ర, 1975 నించీ 2012వరకూ, తెలుగుసాహితీ రీతులు ఎలా ఉండేవి అని ఎవరైనా పరిశీలించి చూడాలనుకుంటే, వారికి దొరికే సమాచారం ఎలా ఉంటుంది అని. ఈ నేపథ్యంలో జరిగిన చర్చ ఇది.

నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు అసమగ్రంగానూ, అసంబద్ధంగానూ, పాక్షికంగానూ ఉంటుంది అనిపిస్తోంది నాకు. కల్పన కూడా సుమారుగా అదే అభిప్రాయం వెలిబుచ్చింది. ఇప్పుడు ఎలా ఉందన్న బాధ కన్నా ముందుతరంవారికి ఈనాటి సాహిత్య చరిత్ర భవిష్యత్తులో ఎలా అందించగలం అన్నది ప్రధానమైన విషయం. మన సాహితీవేత్తలూ, సాహిత్యాభిమానులూ, సాహితీప్రియులూ – సమస్త సాహితీజనులూ సుదీర్ఘంగా, శ్రద్ధగా పరిశీలించవలసిన అవుసరం ఉంది. అదీ ఈ వ్యాసానికి నాంది.

– సూక్ష్మంగా మన సాహిత్యచరిత్ర స్వరూపం ఏమిటి?

– మనకి గ్రంథస్థం అయిన సాహిత్యచరిత్ర చాలా తక్కువ. అందులోనూ కూలంకషంగా పరిశీలించి, నిజానిజాలు పరీక్షించుకుని, అక్షరగతం చేసిన చరిత్ర  మరీ తక్కువ. పైగా సాహిత్యం అనంతంగా సాగుతూనే ఉంటుంది కనక ఎప్పటికప్పుడు దాన్ని పునః పరిశీలించుకోడం అవసరం. అయితే అలా పునః పరిశీలించుకోడానికి కావలసిన వసతి కల్పించడం ఈనాటి విమర్శకుల, వ్యాసకర్తల, ఉపన్యాసకుల, పత్రికాసంపాదకుల, సంకలనకర్తల, రచయితల బాధ్యత.

నేను తొలిసారిగా సాహిత్యచరిత్రగురించి ఆలోచించింది నిడుదవోలు వెంకట్రావుగారి సాహిత్యం చదువుతున్నప్పుడు. ఆయన తనకి ముందు మానవల్లి కవిగారు కవులచరిత్ర రాసినట్టు చెప్పేరు. మానవల్లి కవిగారూ, నిడుదవోలు వెంకటరావుగారూ కూడా కవులను మాత్రమే గణనలోకి తీసుకున్నారు తమ గ్రంథాలకి. అలాగే మొట్టమొదట కవయిత్రులచరిత్ర గ్రంథస్థం చేసేరు ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. అంతవరకూ సాహిత్యచరిత్రలలో కనిపించని అనేకమంది

రచయిత్రులని పరిచయం చేసేరు. ఆ తరవాత మళ్ళీ సాహిత్యచరిత్ర ఒక బృహత్కార్యంగా చేపట్టింది ఆరుద్ర. సమగ్రాంధ్రసాహిత్యం పేరుతో ఆనాడు ఎమెస్కోవారు ఇంటింట గ్రంథాలయం పేరున నెలకో సంపుటం చొప్పున అందించిన సంపుటాలు తెలుగు సాహిత్యచరిత్రలో మైలు రాళ్ళు. సంపుటాల సంఖ్య చెప్పాలంటే కాలక్రమంలో 12, 13, చివరకి 4 అయేయి. ఇంకా ఉన్నాయేమో నాకు తెలీదు.

సమగ్రాంధ్రసాహిత్యం ఆధునికయుగంలో ఆరుద్ర కథ, నాటకం, విమర్శ, సంకలనాలు, సాహిత్యసంస్థలూ, సంఘాలూ – ఇవన్నీ కూడా స్వీకరించేరు. అయినా కొందరు ప్రముఖ కవులు, రచయితలు సమగ్రాంధ్రసాహిత్యంలో కనిపించరు. నేను వ్యాసాలు రాస్తున్నప్పుడు ఈ సంపుటాలు చూస్తే, కనుపర్తి వరలక్ష్మమ్మగారిపేరు. ఈమాట నేను చెప్తున్నది ఆరుద్రగారిని తప్పు పట్టడానికి కాదు. ఇటువంటి బృహత్ కార్యక్రమం చేపట్టినప్పుడు వారు నిర్ణయించుకునే పరిధులమాట అలా ఉండగా, ఇతరత్రా అనేక ఇబ్బందులు కూడా ఎదుర్కొనగలరు కదా. ఆరుద్ర కవులనీ, రచయితలనీ ఎందుకు తమ గ్రంథంలో చేర్చుకోలేదూ అని నేను ప్రశ్నించడం లేదు. అలా వదిలివేయపడిన కవులగురించీ, రచయితలగురించీ భావితరం పాఠకులకి తెలియజేడానికి, మన సాహిత్యచరిత్రలో వారికి తగిన స్థాయి కల్పించడానికి ఇప్పుడు మనం చేయగలిగినది ఏమిటి అనే నాప్రశ్న.

నావైట్ సైటు తూలిక.నెట్ కి కథలనీ, రచయితలనీ ఎన్నుకోడంలో నేను కొంతవరకూ ఈ అభిప్రాయాన్ని మనసులో పెట్టుకునే చేస్తున్నాను. మంచిరచనలు చేసినా, కొమ్ము కాసేవారు లేక ఈనాడు ఆనవాలు లేకుండా పోతున్న రచయితలను, వారి రచనలను ఎంచుకోడం కూడా ఒక నియమంగా పెట్టుకున్నాను. మిగతా పత్రికలూ, విమర్శకులూ, వ్యాసకర్తలూ, తదితర పండితులూ విస్తృతంగా ప్రాచుర్యంలోకి తెస్తున్న రచయితలకి నేను అట్టే ప్రాధాన్యత ఇవ్వని కారణం కూడా ఇదే. అస్సలు తీసుకోనని కాదు కానీ, వారివిషయంలో తాత్సారం చేస్తాను.

నేను చూసినంతవరకూ ఈనాడు వస్తున్న వ్యాసాలూ, సంకలనాలూ, సాహిత్యచరిత్ర పుస్తకాలూ కూడా ఒకే ఒరవడిలో పోతున్నాయి. స్వాతంత్ర్యం రావడానికి ముందు రచనలన్నీ జాతీయోద్యమం, జాతీయదృక్పథం మాత్రమే ధ్యేయంగా పెట్టుకుని కొనసాగినవయితే, స్వాతంత్ర్యం వచ్చినతరవాత వచ్చిన రచనలన్నీ దేశ పునర్నిర్మాణానికీ, సాంఘికసంక్షేమానికి దోహదం చేసేవిగా ఉంటూ వస్తున్నాయి. అది దోషం కాదు. కానీ, ఆ ఊపులో సాంఘిక ప్రయోజనం మాత్రమే పరమార్థం అయిపోయి, తదితర రచనలకి, ముఖ్యంగా ప్రయోగాత్మక రచనలకీ దిక్కు లేకుండా పోవడం న్యాయమేనా, మన సాహితీక్షేత్రం బహుముఖంగా

విస్తరిల్లడానికి ఆటంకం కాదా అని నా సందేహం. ఇది మనం అందరం ఆలోచించుకోవలసిన, పునః పరిశీలించుకోవలసిన పరిస్థితి అనుకుంటున్నాను.

– కథల్లో సాంఘికప్రయోజనం ముఖ్యం కాదా?

– సాంఘికప్రయోజనం కథల్లో ఉండకూడదని కాదు. కానీ అదొక్కటే తిరుమంత్రం అయిపోడం శ్రేయస్కరం అనుకోను. ఈనాడు బహుమతులు పొందిన కథలు, సంకనాలకోసం ఎంచుకున్న కథలు, వ్యాసాలూ, ఉపన్యాసాలూ, పత్రికాసంపాదకులు, పత్రికాధిపతులు ఆదరించి ప్రచురణకి అంగీకరించిన కథలు – వీటిల్లో ఏవి తీసుకుని చూసినా సాంఘికప్రయోజనం ఉంటేనే వాటికి పుట్టగతులు అన్నది స్పష్టంగా కనిపిస్తోంది.

– ఈనాటి సంకలనాలు ఎలా ఉంటున్నాయి?

– సంకలనాలయితే విస్తారంగా వస్తూనే ఉన్నాయి కానీ పైన చెప్పిన సాహిత్యప్రయోజనం మాత్రమే ఏకైక సూత్రంగా ఎంపికలు జరుగుతున్నాయి. ఏ సంకలనం తీసుకున్నా ఆ రచయితలే, ఆ కథలే కనిపిస్తున్నాయి తెలుగుదేశంలో మరి కథకులు లేరేమో అన్నట్టు. పైగా ఆ భాగోతం చాలనట్టు ఆ సంకలనాల్లోంచే అవే కథలు తీసి మళ్ళీ మరో సంకలనంగా ప్రచురిస్తున్నారంటే, తెలుగు సాహిత్యంలో రెండోసారి క్షీణయుగం దాపురించిందేమో అనుకోవాలి. (పూర్వం 1775-1875 తెలుగుసాహిత్యాన్ని క్షీణయుగంగా అభివర్ణించారు.)

విశాలాంధ్రవారు ప్రచురించిన బృహద్గ్రంథం "తెలుగు కథ, 1910-2000" తీసుకోండి. ఈ సంకలనం పేరు చూసినప్పుడు ఆ తొంభై ఏళ్ళలో తెలుగుకథ తీరుతెన్నులు ఎలా ఉండేవో తెలుస్తాయనే అనుకుంటాం కదా. నేను అలాగే అనుకున్నాను. అంటే తెలుగులో వస్తున్న వివిధ కోణాలూ, వివిధ దృక్పథాలూ, వివిధ శైలులూ, వివిధ భాషావిన్యాసాలు చూస్తాం కాబోలు అని. కానీ ఈ కథలన్నీ ఒకే ఒక కోణం – పైన చెప్పిన సామాజిక ప్రయోజనం – సమాజకేంద్ర దృష్టిని ప్రధానంగా పెట్టుకుని ఎంచుకోడం జరిగిందన్నారు సంపాదకులు. అంచేత  వైయక్తికమైన మానసికచిత్రణ, తదితర కోణాలు ఈ సంకలనంలో చోటు చేసుకోలేదు. ఉదాహరణకి, బుచ్చిబాబు **నాగురించి కథ రాయవూ**, లేదా శ్రీరమణ రాసిన **మిథునం** లాటి కథలకి ఇక్కడ స్థానం లేదు.
నిజానికి, **మిథునం** కథలో సమాజకేంద్ర దృష్టి ఉంది- ఒక తరం ముందు దంపతులమధ్య సంబంధం. కానీ అది హింసాత్మకం కాదు, సాత్వికం. అంచేత అది సమాజకేంద్ర దృష్టి కాకుండా పోయింది. అంటే మానవసంబంధాలకి సంబంధించిన కథలు ఎంచుకోలేదు.

మరి ఒక వంద సంవత్సరాలయింతరవాత తెలుగుకథగురించి ఎవరైనా పరిశోధన చేస్తే ఈ పుస్తకం పరీక్షించి చూస్తే వారికి కలిగే అభిప్రాయం ఎలా ఉంటుందంటారు? సాధారణంగా పరిశోధకులు ఇంకా అనేక సంకలనాలు కూడా చూస్తారు కనక నాప్రశ్న మరీ విపరీతం అనుకుందాం. కానీ ఈనాడు వచ్చే సంకలనాలన్నీ సాంఘికప్రయోజనం తప్ప కథకి మరో ప్రయోజనం లేదన్నట్టుగానే ఉంటున్నాయి కదా. మరి సాముదాయికంగా ఎవరికి గానీ కలిగే అభిప్రాయం ఎలాటిదై ఉంటుంది ఈ సంకలనాలవల్ల?

ఇలా ఆలోచించినప్పుడు, విశాలాంధ్రవారి సంకలనానికి, "తెలుగుకథల్లో సామాజిక ప్రయోజనం" లాటి పేరేదో పెట్టి ఉంటే మరింత స్పష్టంగా ఉండేది. శైలికి ప్రాధాన్యం లేదిక్కడ. అప్పుడు, బుచ్చిబాబులాటి రచయితలు రాసిన విలక్షణమైన కథలకి అక్కడ లేని లోటు కనిపించదు. నిజానికి బుచ్చిబాబు కథ ఇందులో లేనంతమాత్రాన ఆయనకి పోయిందేమీ లేదు. ఆయనకథలు చాలా సంకలనాల్లో వచ్చేయి. కానీ నామటుకు నాకు ఈ పుస్తకంలో కొన్ని కథలు "మంచికథలు" అనిపించలేదు. సంకలనకర్తలు "సామాజికకేంద్ర దృష్టి" మాత్రమే తీసుకుని ఎంపిక చేసిన కథలవి. ఏతా వాతా నేనంటున్నది – తెలుగు సాహిత్యచరిత్ర సమగ్రంగా బావితరాలకి అందించాలంటే. ఆ వదిలేసిన కథలూ, రచయితలూ కూడా ఎక్కడో అక్కడ గ్రంథస్థం కావాలి.

– ఒక కోణం మాత్రమే ప్రాతిపదికగా సంకలనాలు సమకూర్చకూడదా?

– సాహిత్యం మహా సాగరం, నిరంతరప్రవాహం. సంపూర్ణంగా సాహిత్యచరిత్ర రాయడం ఎప్పుడూ సాధ్యం కాదు. అంచేతే తెలంగాణా సాహిత్యచరిత్ర, రాయలసీమ సాహిత్యచరిత్ర, స్త్రీల సాహిత్యచరిత్ర, కృష్ణాజిల్లా సాహిత్యచరిత్ర, స్త్రీవాదం, దళితవాదం … ఇలా ఒక్కొక్క విభాగం తీసుకుని సంకలనాలు వస్తున్నాయి. అది మంచిదే. కానీ ప్రస్తుతం ఇందులో కూడా రెండు లోపాలు కనిపిస్తున్నాయి. ఒకటి, ఎవరు చేసిన సేవ ఏమిటి, ఎవరికథలు ఎంచుకోవాలి అన్న విషయంలో వ్యక్తిగతమైన అభిమానాలు ఆధారంగా సంకలనాలు తయారు చేయడం ఎక్కువగా కనిపిస్తోంది. "ఇరవయ్యశతాబ్దపు రచయిత్రులు" అని పేరు పెట్టిన కథలసంకనలంలో నాకు తెలిసిన కొందరు ప్రముఖ రచయిత్రులకథలు లేవు. కనీసం కొన్ని కథలు సంకలనకర్తల స్వంత ఇష్టాయిష్టాలమీద తీసుకున్నట్టు ఉన్నాయి. ఇది సాహిత్యచరిత్ర దృష్ట్యా ఆరోగ్యం కాదు అంటున్నాను.

– అంటే సంకలనాలన్నీ తప్పనిసరిగా వైవిధ్యం కలిగి ఉండాలా?

– ఒక రచయితో ఒక సాహిత్యాభిమానో తనకి నచ్చిన కథలు మాత్రమే ఎంచుకుని సంకలనం వెయ్యాలనుకుంటే అది వారి కష్టం కనక వారిష్టం. "ఈవారం నన్ను దర్శించుకున్న

రచయితలకథలే నాసంకలనంలో చేర్చుకుంటాన”నో, “నల్లచీరె కట్టుకున్నవారి కథలకి మాత్రమే నాసంకలనంలో స్థానం” అనో నియమం పెట్టుకుని, అలా ఓ సంకలనం తయారు చేస్తే ఎలా కాదనగలం? ఎటొచ్చీ వారు ఆమాట ముందుమాటలో స్పష్టం చేస్తే పాఠకులకి మరింత సుకరం అవుతుంది. నాలాటివారికి చక్కగా అది అర్థం అవుతుంది.

– మరి మీదృష్టిలో సమగ్రమైన సాహిత్యచరిత్ర సృష్టించడానికి ఎవరు పూనుకోవాలి?

– ఎకాడమీలు, విశ్వవిద్యాలయాలు వేసే సంకలనాలు బాధ్యతాయుతంగా ఉండాలి. బహుముఖాలుగా విస్తరించుకుంటున్న మన సాహిత్యాన్ని తమ ఎంపిక ప్రతిబింబిస్తోందా లేదా అన్నది పరిశీలించి చూసుకోవాలి. వారు సంకలనం సమకూర్చే పని ఎవరికి అప్పచెప్తున్నారో, వారి సామర్థ్యాలు, అర్హతలూ, ఏమిటో జాగ్రత్తగా పరిశీలించి చూసి, ఆమాట అంటే సంకలనంయొక్క ధ్యేయం ఆ సంపాదకులకి చక్కగా వివరించి చెప్తే, ఆ సంపాదకులు ఆ విషయం మనసులో పెట్టుకుని ఎంపిక చేస్తేనే మనకి మంచి సంకలనాలు వచ్చే అవకాశం.

– రచయితలు ఎవరికి వారు ప్రచురించుకుంటున్న సంకనాలమాట ఏమిటి మరి?

– ఈసంకలనాల్లో రచయితలు తీసుకున్న వస్తువులో, కథ నడిపిన తీరులో వైవిధ్యం ఉండొచ్చు కానీ మళ్లీ మార్కెటింగుమాట వచ్చేసరికి, ముందు చెప్పిన బాధే. “సాంఘికప్రయోజనం ఉన్న కథలయితేనే పాఠకులు కొంటారు” అంటారు ప్రచురణకర్తలు. అంతే కాక, ఈ కథలన్నీ పత్రికలశంఖంలో పోసి, తీర్థం అనిపించుకున్న తరవాతే కదా సంకలనాలుగా వెలువడడం. అంచేత ఆ కళలే ఇక్కడ కూడా కనిపిస్తాయి.

అయితే కదాచితుగా మినహాయింపులుండొచ్చు. కిందటేడు కొత్తపాళీ నాకో సంకలనం ఇచ్చేరు. రచయిత పోలవరపు కోటేశ్వరరావు. ఆయన ముందుమాటలో ఆ కథలు ఏ పత్రికలలోనూ ప్రచురించినవి కావనీ, సంపాదకులనియమాలు తమకి నచ్చక, ఇలా నేరుగా పుస్తకరూపంలో ప్రచురిస్తున్నాననీ అని రాసేరు.

– పత్రికలు, ఎడిటర్లు, పత్రికాధిపతులు – వీరి బాధ్యలు ఏమిటి?

– పత్రికలలో రెండు రకాలున్నాయి కదా. వార్తలందించేవీ, కథలు అందించేవి. మొదట, వార్తలమాట చూద్దాం. ఈమధ్య విలేఖరులు ఇంట్లో కూర్చుని తమకి తోచింది రాసి పత్రికలకి ఇచ్చేస్తున్నారు. సంపాదకులు తిరిగి చూడకుండా వేసేసుకుంటున్నారు. ఈ పత్రికలు విదేశాల్లో లైబ్రరీల్లో మైక్రోఫిష్ రూపంలో దాచుకుంటున్నారు. మరి ఈ విలేఖరులు తమకి తోచినట్టు గిలికి

పారేస్తే అది సాహిత్యచరిత్రకి ద్రోహం కాదా? సభకి ఎవరు వచ్చేరు, ఎవరు రాలేదు వంటి చిన్న విషయాలు వదిలేయండి. నిజానికి అవి కూడా ఆ వ్యక్తుల అభీష్టాలూ, అభిప్రాయాలూ తెలుసుకోడానికి కొంతవరకూ దోహదం చేస్తాయి. కానీ అంతకంటే ఘోరం ఒక వ్యక్తి నమ్మకాలనీ, అభిప్రాయాలనీ, విలువలనీ తారుమారు చేసేసేవి. నేను హైదరాబాదులో ఓ సభలో మాటాడినప్పుడు నేను చెప్పినమాటలు వదిలేసి, ఓ ప్రముఖవిలేఖరి "మాలతిగారు అమెరికాలో తెలుగుసంఘాలు చేస్తున్న సేవని అభినందిచేరు," అని రాసేడు. నిజానికి నేనసలు తెలుగుసంఘాలమాట ఎత్తనేలేదు. ఎప్పుడూ ఎక్కడా నా ఉపన్యాసాల్లో నేనాప్రసక్తి తేలేదు. దానికి ప్రత్యేకమైన కారణం ఉండడంచేతే నేను తేను. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే వారికి నాకృషిమీద గౌరవం లేదు. నాకు వారికృషిమీద గౌరవం లేదు. మరి చరిత్రలో నా అభిప్రాయం ఈ విలేఖరుడిమూలంగా అసంబద్ధంగా మారిపోయింది. వీళ్ళంతా జర్నలిజం క్లాసుల్లో ఏమిటి నేర్చుకుంటున్నారు?

– మరి కాల్పనిక సాహిత్యం మాటేమిటి?

– పూర్వం ఆంధ్రపత్రిక, భారతి, కృష్ణాపత్రిక, ఆంధ్రప్రభ లాటి పత్రికలలో ఒక కథ వచ్చినా, ఒక వ్యాసం వచ్చినా దానికి చెప్పుకోదగ్గ స్థాయి ఉందని పాఠకులు నిశ్చింతగా నమ్మగల స్థితి ఉండేది. కానీ, ఇప్పుడు ఈ తలా తోకాలేని కతలమూలంగా పత్రికలస్థాయి దిగజారిపోయినట్టే అనిపిస్తోంది.

ఆరోజుల్లో ఫలానా పత్రికలో నాకథ వచ్చిందని గర్వపడడానికి ఆస్కారం ఉండేది. ఇప్పుడలా అనిపించడం లేదు. ఎందుకంటే పత్రికలు కూడా ఈ సాహిత్యప్రయోజనం పేరున మూస కథలకే పెద్దపీట వేస్తున్నారు. **మిథునం**లాటి కథలు ఏటికో కోటికో ఒకటి రావొచ్చు కానీ సర్వసాధారణం కాదు. ఆకథకి అంతటి ప్రాచుర్యం వచ్చిందంటే మనకి భిన్నకోణాలు గల కథలు వస్తున్నాయి, వాటిని పాఠకులు ఆదరిస్తున్నారనే కదా. ఇలాటి కథలని ఏరి విశాలాంధ్రవారు "తెలుగుకథ" రెండో సంపుటం ప్రచురించాలి మన కథాచరిత్ర సమగ్రం కావాలంటే.

అసలు ఈ సంకలనాలకి కథలఎంపికల్లో ఆశ్రితపక్షపాతం కనిపిస్తోంది అన్నా తప్పు లేదేమో. ఈరోజుల్లో ఏ పత్రికలో ఎవరికథలు ప్రచురిస్తారో చెప్పగలం. ఎవరికథ ఎలా ఉంటుందో చెప్పగలం. ఏ సంపాదకుడికి ఎలాటి కథ కావాలో తేలిగ్గానే చెప్పగలం. మళ్ళీ ఈ సంపాదకులే మంచికథలు రావడం లేదంటారు. కొత్తరకం కథలు రావడం లేదంటారు. కొత్తరకమైన కథ ఎలా వస్తుంది తమరు ప్రచురించుకోడానికి సిద్ధంగా లేకపోతే.

సంకలనాల్లాగే చారిత్ర్యకవ్యాసాలూ, విమర్శనాత్మకవ్యాసాలూ కూడా ఇలా స్వకీయమైన ఒక కోణంలోనే రాయడం జరుగుతోంది. వ్యాసాలు ఎవరు రాసేరో చూస్తే, వారు ఎవరిని తమ వ్యాసంలో ఉదహరించి ఉంటారో తేలిగ్గా ఊహించుకోగల పరిస్థితి ఏర్పడింది. సాహిత్య చరిత్ర రాసేవారు కూడా – ఇందాకా ఆరుద్రగారిగురించి అన్నాను – తమపరిధిలో తాము ఏ సూత్రాన్ని పాటించి చరిత్ర రాస్తున్నారో ముందే నిర్ణయించుకుని చరిత్ర అలా రాయడం ఒక పద్ధతి. అది తప్పని కాదు కానీ వాటిలో కొంత సమతుల్యత పాటించవలసిన అవసరం ఉంది. కథలకంటే వ్యాసాల్లో ఇది మరీ అవసరం. వ్యాసకర్త మరింత సమ్యగ్ దృష్టితో విషయాన్ని పరిశీలించినప్పుడే మన సాహిత్యచరిత్ర పటిష్ఠమవుతుంది.

ఇప్పుడు ప్రింటు పత్రికలు, జాల పత్రికలు అని రెండు తరగతులుగా విభజించి చూద్దాం. ఆమధ్య ఒక జాలపత్రిక సంపాదకుడు నాకొక వ్యాసం పంపేరు. అది రచయితలకీ పత్రికలసంపాదకులకీ మధ్య గల అవినాభవసంబంధంవిషయంలోనే అయినా, ఆ వ్యాసం ప్రధానంగా ఎడిటింగ్ వృత్తిగా స్వీకరించి రచనలకి మెరుగులు దిద్దేవారిగురించి. అలా డబ్బు పుచ్చుకుని సరిగా ఎడిటింగు చెయ్యనివారు కూడా ఉన్నారనుకోండి. అది అప్రస్తుతం మనకి. ఆ సందర్భంలోనే ఆ సంపాదకుడు మరొక మాట కూడా అన్నారు, “రచయితలు అంతా తమకే తెలుసనీ, సంపాదకులకి ఏమీ తెలీదని అనుకుంటారు” అని. ఈ విషయం, ఎవరికెంత తెలుసు, అసలు ఎంత తెలియాలి, అసలు ఏమిటి తెలియాలి అన్నవి వీలయినంత వివరంగా పరిశీలించి చూడాలని నేను అనుకుంటున్నాను.

– తెలుగు పత్రికల ఆవిర్భవం, సంపాదకులు తొలిదశలో పాటించిన పద్ధతులేమిటి?

– మొత్తం తెలుగు పత్రికలచరిత్ర అంతా ఇక్కడ తవ్వి తీయడం సాధ్యం కాదు కానీ స్థూలంగా కాశీనాధుని నాగేశ్వరరావుగారు భారతి ప్రారంభించిననాటినుండీ, పత్రికలు రచయితలని ప్రోత్సహించడం ఒక పనిగా స్వీకరించేయి. ఆ ఊపులోనే రచయితలని కథలు, వ్యాసాలు రాయమని కోరడం, వందలూ వేలూ కాకపోయినా తృణమో పణమో రచయితలకి ముట్టజెప్పడం కూడా ఆనవాయితీగానే వస్తూ వచ్చింది. 50, 60 దశకాలనాటికి పత్రికలసంఖ్య హెచ్చింది, రచయితలసంఖ్య హెచ్చింది. సంపాదకులు అడక్కుండానే రచనలు పత్రికలఆఫీసులకి ఇబ్బడిముబ్బడిగా రావడం మొదలయింది.

– ఈ పద్ధతులు ఎప్పుడు, ఎలా మారేయి?

– 1977లో పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు ఒక వ్యాసంలో వారపత్రికలు, మాసపత్రికలు దాదాపు నెలకి 200 నవలలు, 1500 కథలు ప్రచురిస్తున్నారనీ, అంతకి పదింతలు రచనలు పత్రికలఆఫీసులకి వచ్చి ఉంటాయనీ అన్నారు.

ఆరోజుల్లో రచయితలకి సంపాదకులు సలహాలు ఇవ్వడం లేదు. ఇష్టమయితే ప్రచురించేరు. లేదా, తిరిగి పంపేసేరు. అంతే. సుప్రసిద్ధ రచయితలలోగిళ్ల పెరిగినవారు, చాగంటి తులసి, తురగా జానకీరాణి వంటివారికి ఆ రచయితలు ఏమైనా సలహాలిచ్చేరేమో నాకు తెలీదు. ఇంగువ కట్టిన గుడ్డలా ఆ వాతావరణంలో పెరగడంచేత రచనావిధానం వారికి అలవోకగా వచ్చేసి ఉండొచ్చు.

క్రమంగా రచయితలు, పత్రికలు కూడా హెచ్చయినతరవాత కూడా ప్రింట్ పత్రికలు సంపాదకులు రచయితలకి సలహాలిచ్చే పని పెట్టుకోలేదు. ఇప్పటికీ అంతే. సంపాదకులకి అంత సమయం లేకపోవడం, తపాలాకి సంబంధించిన కష్టనిష్ఠూరాలు కారణం కావచ్చు. కానీ నాకు ఇప్పుడు మరో సందేహం కలుగుతోంది – అలా సంపాదకులు సూచనలు ఇవ్వనందున ఆకథల లేదా పత్రికలస్థాయి ఏమైనా తరగడం కానీ పెరగడం కానీ జరిగిందా? ఈవిషయంలో పరిశోధనలేమైనా జరిగేయా?

-మంచి కథలు రావడం లేదంటే ఎందుకు రావడం లేదు? అసలు ఏవి మంచి కథలు?

– ఇంతకీ ఈనాడు మంచి కథలు రావడం  లేదన్న వ్యాఖ్యలయితే వింటున్నాం కానీ దానికి కారణం సంపాదకులు వాటిని సంస్కరించకపోవడం అంటే నేను నమ్మలేను. అంతే కాక, ఈ ప్రింటు పత్రికలవిషయంలో మరొక ఆచారం ప్రారంభమయింది – అది "చెప్పకయే చెప్పుట." అంటే కథ ఇలా ఉండాలి అని ప్రతి కథకి మార్పులూ, చేర్పులూ సూచించరు ఈ సంపాదకులు. కానీ వేటిని అంగీకరిస్తున్నారో, వేటిని తిరగ్గొడుతున్నారో గమనిస్తే రచయితలకి సులువుగానే బోధపడుతాయి సంపాదకుల ఆశయాలు. ఇదే నేను వెనకటిటపాలో చెప్పిన "సాహిత్యప్రయోజనం". అంటే దుష్టబుద్ధులు బడుగుజీవులని ఏదోవిధంగా హింసించడం. హింస ఉంటేనే సామాజిక ప్రయోజనం అన్న విపరీతార్థం మాటల్లో చెప్పకపోయినా, సంపాదకుల, విమర్శకుల, కొందరు పాఠకుల "చెప్పకయే చెప్పు" పద్ధతిద్వారా స్థిరపడిపోయింది.

– జాలపత్రికల ఆవిర్భవించిన తరవాత వచ్చిన మార్పులు ఏమిటి

– జాలపత్రికలు వచ్చి 10, 12 ఏళ్ళయిందనుకుంటాను. ప్రింటు పత్రికలకి లేని, జాలపత్రికలకి ఉన్న అధిక సౌకర్యం ఇమెయిలు. రెండోది, ప్రింటు పత్రికలకి వచ్చినంత ఉద్ధృతంగా జాలపత్రికలకి

కథలు రావనుకుంటాను. నా అంచనా పదో, పాతికో వస్తాయని. అంచేత జా.ప. సంపాదకులకి ఆ కథలు సూక్ష్మంగా పరిశీలించడానికి కావలసినంత సమయమూ, ఉత్సాహమూ కూడా ఉండి ఉంటుంది బహుశా.

ఈకాలంలో జాలపత్రికలు చూసేవారందరికీ కంప్యూటరు అందుబాటులో ఉంటుంది కనక జాలపత్రికలకే ప్రాచుర్యం ఎక్కువ అని అనిపించినా, దేశంలో ఉన్న తెలుగు పాఠకులలో ప్రింటు పత్రికలు చూసేవారే ఎక్కువ అని నేననుకుంటున్నాను. ఇది కూడా ఒక కారణం జాలపత్రికలకి కథలు ఎక్కువగా రాకపోవడానికి.

మూడోది, ఈ జాలపత్రిక సంపాదకులు చాలావరకు పాశ్చాత్యదేశాల్లో ఉన్నవారు పాశ్చాత్య సంప్రదాయాల్ని క్షుణ్ణంగా ఆకళించుకున్నవారు (ఆకళించుకున్నారనే ఆశిద్దాం.) కనక వీరి "సంపాదక"విధానంలో కూడా మార్పు వచ్చింది. ఇక్కడ ముఖ్యమైన మార్పు సంపాదకులు వారిదృష్టిలో కథకి అవసరం అనుకున్న మార్పులు రచయితలకి సూచించడం.

సంపాదకులు ప్రవేశపెట్టిన కొత్త ఆచారాలకి రచయితలు ఎలా స్పందిస్తున్నారు?

కొందరు ఆ సూచనలని స్వీకరిస్తున్నారేమో కానీ కొందరు అంత సుముఖంగా లేరని మొదట్లో ఉదహరించిన వాక్యంవల్ల స్పష్టమవుతోంది. నేను కూడా కొందరు సంపాదకుల సూచనలు అంగీకరించలేదు.

మొదట్లో చెప్పినట్టు, కారణం ఏదైనా ప్రింటుపత్రికలు ఈ సూచనలజోలికి పోలేదు. నచ్చితే వేసుకున్నారు. లేకపోతే లేదు. నేను ఆ సాంప్రదాయంలో పెరిగేను. అసలు మన సాంప్రదాయంలో **నిరంకుశో కవయః** అని ప్రతీతి. శ్రీకృష్ణదేవరాయలునుండీ రాజరాజనరేంద్రుడునుండీ నిన్నా మొన్నటి కాశీనాథుని నాగేశ్వరరావుగారివరకూ కవులని గ్రంథాలు రాయమన్నా, వారు రాసినవి అంకితం పుచ్చుకున్నా, తరవాతికాలంలో పత్రికలకి వ్యాసాలూ, కథలూ రాయమన్నా వారెవరూ ఆ రచనలకి ప్రచురణార్హత కలిగించడానికి "సూచనలు" అంటూ తప్పులు పట్టలేదు. "ఇలా రాస్తే తప్ప మేం పుచ్చుకోం" అన్లేదు. జాలపత్రిక సంపాదకులు, "మేం ఏ సూచనలు చేసినా, తుది నిర్ణయం రచయితలదే" అంటున్నారు కానీ, ఒక కథలో ఒకే అంశంమీద రెండు, మూడు మెయిళ్ళు నడిపితేనూ, ఒకరితరవాత ఒకరు సంపాదకులు రచయితని సంప్రదిస్తేనూ అది ఒత్తిడి చేస్తున్నట్టే ఉంటుంది కానీ రచయితనిర్ణయానికి వదిలిపెట్టినట్టుండదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే నాకొచ్చిన సూచనలు చాలావరకూ హాస్యాస్పదంగా ఉన్నాయి.

నాఅభిప్రాయంలో అలా కథలో సంపాదకులు చెప్పిన మార్పులు చేస్తే, అది ఆ రచయిత సృజన అనిపించుకోదు. అలా మార్చిన భాగాన్ని పాఠకులు మెచ్చినా, తెగడినా ఆ కీర్తి ఆ సంపాదకుడికే దక్కాలి. కానీ "అది నాది కాదండీ, ఆ సంపాదకులప్రతిభ," అని చెప్పలేరు రచయితలు.

మరోమాట కూడా ఇక్కడే చెప్తాను. రచయితలందరూ ఇలాగే అనుకోకపోవచ్చు. నేను చెప్పేది నాఅభిప్రాయమే అయినా నాలా ఆలోచించేవారు ఇంకా ఉన్నారు కనక ఇక్కడ మరోసారి స్పష్టం చేస్తున్నాను. నాకథలో తప్పులున్నా, ఒప్పులున్నా వాటికి నేనే బాధ్యురాలిని. అలా తప్పులు చేయగల స్వేచ్ఛ నాకు కావాలి. నాకున్న సామర్థ్యం అన్ని తప్పులతోనూ ఉన్నదున్నట్టు పాఠకులకి తెలియాలి. అంతేగానీ సంపాదకులు చేసిన షోకులతో నాకథని నాసృజనగా చెప్పుకోలేను. యం.వి. రమణారెడ్డిగారు తనకథలమీద  కాళీపట్నం రామారావుగారు ఇచ్చిన సూచనలని అర్థం చేసుకున్నా కథలు మాత్రం అలాగే ఉంచేసేనన్నారు తనసంకలనం "పరిష్కారం"కి ముందుమాటలో.

కాల్పనిక సాహిత్యంలో "ఎవరికి ఎంత తెలుస"న్న విషయం కాదు ఆలోచించవలసింది. రచయితలు తమ భావాలని తమకి వచ్చినభాషలో తమకి తోచినవిధంగా లేదా చేతనవిధంగా చెప్తారు. సంపాదకులు ఈ విషయం మనసులో పెట్టుకుని సమతూకంతో, వస్తునిష్ఠతో మాత్రమే సూచనలు చేస్తే రచయితలు ఆలోచించుకోడానికి ఇష్టపడవచ్చు. వెనక ఓ టపాలో నేనూ, మరికొందరు రచయితలు వ్యాఖ్యలరూపంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు చూడండి. అమెరికన్ సంపాదకులు ఏం చేస్తే అవన్నీ మనం పాటించి తీరాలా?

పైన చెప్పిన వ్యాసం చూసినవెంటనే నాకు కలిగిన సందేహం "ఇంగ్లీషువాడు చేసిన ప్రతి పనీ మనం చేసి తీరాలా విస్సన్న చెప్పిందే వేదం అన్నట్టు?" అమెరికన్ పత్రికలవారితో నా అనుభవం చెప్తాను. ఇక్కడ మనం ముఖ్యంగా గుర్తు పెట్టుకోవలసింది రెండు విషయాలు. అమెరికాలో వ్యాపారపత్రికలు వేరు, సాహిత్యపత్రికలు వేరు. ఈ సాహిత్యపత్రికలప్రచురణలో డబ్బు లేదు. మన జాలపత్రికలలో కూడా సంపాదకులకీ, రచయితలకీ కూడా ఆదాయం లేదు కనక, వీటిని సాహిత్య పత్రికలనే అందాం.

రెండోది, ఈ సాహిత్యపత్రికలఎడిటర్లు ఎడిట్ చెయ్యరు నాకు తెలిసినంతవరకూ. నేను ఇంగ్లీషుపత్రికలకి కథలు, వ్యాసాలు పంపినప్పుడు ఎవరూ ఎడిట్ చెయ్యలేదు. వేసుకున్నప్పుడు నేనెలా పంపేనో అలా వేసుకున్నారు. వేసుకోనప్పుడు, "మీరచన అంగీకరింపడలేదు. మేము కాకపోతే మరొక పత్రిక వేసుకోవచ్చు. చూడండి. తప్పక రాస్తూ ఉండండి," అని ఓ చిన్న నోట్ పెట్టి

తిరగ్గొట్టేరు. అంచేత తప్పనిసరిగా అమెరికన్ పత్రికలన్నీ మన జాలపత్రిక సంపాదకులు అనుకున్నట్టు “సూచనలు” ఇస్తారనుకోడం పొరపాటు.

చివరిమాటగా, జాలపత్రికలసంపాదకుల సూచనలమూలంగా కథలస్థాయి ఏమైనా పెరిగిందా? ఈవిషయంలో పరిశోధనలేమైనా జరుగుతున్నాయా? రచయిత ఏం చెప్పదలుచుకున్నాడో రచయితకంటే తమకే ఎక్కువ తెలుసనా?

విమర్శలలో వచ్చిన మార్పులు ఏమిటి?

విమర్శలు – ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు, నార్ల వెంకటేశ్వరరావు – వీరు రాసిన విమర్శలు నేను చదవలేదు కానీ వీరివిమర్శనారీతులని కొలమానంగా ఉదహరిస్తుంటారు ఆ తరవాత వచ్చిన విమర్శకులు, వ్యాసకర్తలు. ఈ పద్ధతి 70వ దశకంలో మారిపోయినట్టు కనిపిస్తోంది. విమర్శల్లో కొంత సంయమనం తగ్గుతూ వస్తోంది. పురాణం సుబ్రహ్మణ్య శర్మగారిలాటి ప్రసిద్ధ జర్నలిస్టు పరస్పరవైరుధ్యం గల అభిప్రాయాలు తమ వ్యాసాల్లో వెలిబుచ్చడం చూశాను. అలా బాధ్యతారహితంగా పొగడడమో తెగడడమో చేయడం చూస్తే నాలాటి సామాన్యులకి ఆశ్చర్యం కలగకమానదు కదా. ఈవిషయం విపులంగా నా పుస్తకం “Telugu women’s writing, 1950-1975” లో చర్చించేను.

ఇంతకీ ఇక్కడ చెప్పదలుచుకున్నది ఇలా బాధ్యతారహితంగా చేసే విమర్శలద్వారా మన కన్ను మనమే పొడుచుకుంటున్నాం. అంటే అదే పనిగా అయితే అందలమెక్కించడమూ, లేకపోతే బురదలోకి లాగడమూ చిత్తశుద్ధిగల విమర్శకులు చేయదగ్గ పని కాదు. దీనివల్ల సాహిత్యానికి కీడే కానీ మేలు జరగదు. పైగా తమకే అప్రతిష్ఠ కూడాను. ఒక రచన చదివి, అది తమకి నాసిరకం అనిపిస్తే ఆమాట తప్పకుండా చెప్పాలి. అందుకు సందేహం లేదు. కానీ ఆ అభిప్రాయం ఇవాళొకటీ, రేపొకటీ, ఇక్కడొకటీ, అక్కడొకటీ అయితే, ఆ విమర్శకుడి చిత్తశుద్ధిని శంకించవలసివస్తుంది.

(ఆగస్ట్ 7, 2012)